శ్రీనివాసరావు, ప.

శ్రీమహాదేవగోవిందరనడే జీవితము

చెన్నపురి, 1917

Śrīnivāsarāvu, Pa.

Śrīmahādēvagōvindaranaḍē Jīvitamu

Cennapuri, 1917

Record no. 656

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

శ్రీనివాసరావు, ప.
శ్రీమహాదేవగోవిందరనడే జీవితము / ప. శ్రీనివారావు గారిచే విరచితము.- చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1917.
24 p. ;16 cm.
Record no. 656

Śrīnivāsarāvu, Pa.
Śrīmahādēvagōvindaranaḍē Jīvitamu / Pa. Śrīnivārāvu gāricē viracitamu.- Cennapuri : Vāviḷḷa Rāmasvāmiśāstrulu aṃḍ Sans, 1917.
24 p. ;16 cm.
Record no. 656

35 mm microfilm
Image placement: IA IIA IB IIB Date filming began: 25 January, 2006

శ్రీః.

# శ్రీ మహాదేవగోవిందరానడే జీవితము.

శ్రీ ప. శ్రీనివాసరావు, బి. ఏ., గారిచే

విరచితము.





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 1917. వెల 2 అణాలు.

PRINTED BY
V. RAMASWAMY SASTRULU & SONS,
AT THE AUDI SARASWATY NILAYA PRESS,
69, MALAYAPERUMALL STREET, MADRAS.—1917.



శ్రీరస్తు.

# మహాదేవగోవిందరానడే జీవితము.

---

శ్లో. “యద్యద్విభూతిమత్సత్త్వం
శ్రీమదూర్జితమేవ వా,
తత్తదే వావగచ్ఛ త్వం
మమ తేజోంశసంభవమ్.”

అని భగవంతుఁడు అర్జునునితోఁ జెప్పెను. సర్వశరీరధారులలో పరమేశ్వరునిచిత్కళ ప్రకాశించును; మహాత్ములలో నది విశేషము వ్యక్తమగును. మహాత్ములు భగవంతునియవతారపురుషులు. వారిచర్యలఁ గన్నులారఁ జూడవలెను. వారిహితోపదేశములఁ జెవులార వినవలెను. ఈమహాపురుషులనునట్టి కనుపులఁ బట్టుకొని, మనము కాలారోహణముఁ జేయుచున్నాము. వారిరాక మేలురాక. ఆమహాత్ములు జీవించియుండుటవలన, లోకమున కలజడి లేదు. వారు మృతజీవులు; వారు సిద్ధసంకల్పులు; వారు స్వార్థ

శ్రీః.

# శ్రీ మహాదేవగోవిందరానడే జీవితము.

శ్రీ ప. శ్రీనివాసరావు, బి. ఏ., గారిచే

విరచితము.





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే

ప్రకటితము.

కాపీరైట్. 1917. వెల 2 అణాలు.

PRINTED BY
V. RAMASWAMY SASTRULU & SONS,
AT THE AUDI SARASWATY NILAYA PRESS,
69, MALAYAPERUMALL STREET, MADRAS.—1917.



శ్రీరస్తు.

# మహాదేవగోవిందరానడే జీవితము.

---

శ్లో. "యద్యద్విభూతిమత్సత్త్వం
శ్రీమదూర్జితమేవవా,
తత్తదేవావగచ్ఛత్వం
మమ తేజోంశసంభవమ్."

అని భగవంతుఁడు అర్జునునితోఁ జెప్పెను. సర్వ శరీరధారులలో పరమేశ్వరుని చిత్కళ ప్రకాశించును; మహాత్ములలో నది విశేషము వ్యక్తమగును. మహాత్ములు భగవంతుని యవతారపురుషులు. వారిచర్యలఁ గన్నులారఁ జూడవలెను. వారిహితోపదేశములఁ జెవులార వినవలెను. ఈమహాపురుషులనునట్టి కనుపులఁ బట్టుకొని, మనము కాలారోహణముఁ జేయుచున్నాము. వారిరాక మేలురాక. ఆమహాత్ములు జీవించియుండుటవలన, లోకమున కలజడి లేదు. వారు మృతజీవులు; వారు సిద్ధసంకల్పులు; వారు స్వార్థ

పరులు కారు; దేహమునం దభిమానమును విడిచి, లోకోపకారార్థము వారు శ్రమపడుదురు; వారిచర్యలకు దేశకాలపరిమాణము లేదు. వారు చేసినకార్యముల ననుసరించి,లోకులు ప్రవర్తించినయెడల,లోకములకు స్వాస్థ్యము నిలిచి యుండును. వారియుపదేశములప్రకారము లోకులు నడచికొనవలయును. వారి నామముల నుచ్చరించుటవలన, సకలపాపములు పోవును.

'మహాదేవ-గోవింద-రానడే,' 'గోపాల-కృష్ణ-గోఖ్లే,' 'ఫిరోజిషా-మెహతా',— ఈమహాపురుషులు మువ్వురు సమకాలికులు. వారు మువ్వురు భగవంతుని ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తిస్వరూపులని చెప్పవచ్చును. లేక, ప్రభుమంత్రోత్సాహశక్తిస్వరూపులనియైన చెప్పవచ్చును. వా రనేకకార్యములఁ జేసిరి; వారికార్యములలోనే వారింజూడవలయును; వారికిని వారికార్యములకును భేదము లేదు; వారిప్రయోజకత్వమంతయు వారిపనులలోఁ జూడనగును.

ఈమహాత్ములు లోకకార్యముఁ జేయ గలరనియు మఱియొకదానిం జేయలేరనియు చెప్పవలదు; వారు



సకలగుణధాములు గాని మఱియొకటి కాదు. వారన్నివిద్యలలోను కొంచెముకొంచెము ప్రవీణులు; ఏ విషయమును గుఱించి ముచ్చటింపవలసి వచ్చినపుడు, వా రావిషయమునుగుఱించి తణుకు చెణుకు లేకుండ ప్రసంగింతురు. సంపూర్ణప్రభావుఁడును, చతుష్షష్టి కళాపూర్ణుఁడు భగవంతుఁడు కాని మనుజులుకారు అయినను, యథాశక్తి, దేశకాలానుగుణముగ మహాపురుషులు కాలము వ్యర్థము సేయక, సర్వకళలలోఁ బ్రవేశముఁ గని, వానిని వృద్ధిఁ జేయుదురు.

సామాన్యజనులు పనుల నారంభించుటకు మంచి సమయములకు నిరీక్షింతురు; మహాపురుషులు సమయములఁ జేసికొని, పనులఁ బ్రారంభింతురు; సామాన్యజనులు వారిమార్గము ననుసరించి గమనింతురు. దరిత్రోవలు లేనిప్రదేశములలో రాదారిమార్గములను కనిపెట్టి, ఆమార్గములవెంబడి ప్రయాణములను సాగింపుమని మహాత్ములు బోధించుదురు. ఆమార్గముల ననుసరించి గమనించుటవలన మనుజులకు శ్రేయస్సుకలుగును; అన్నివిధముల వారికి మంగళములు ప్రాప్తించును. ఈమార్గములఁ జూచి, వారి యనుభవజ్ఞాన మిట్టిది యని గ్రహింపనగును.

గోవిందుని యొక్క జీవితాంశములు విశేషము తెలియవు; అతఁడు సంసారుల కుటుంబములోఁ బుట్టెను; విశేషము భాగ్యము కలదని వారికిఁ బుష్టి లేదు; సంపద లేదని నష్టి లేదు; వారిస్థితిగతులు సామాన్యములు. అతఁడును అతనివంశమువారును మహారాష్ట్రులు; మహారాష్ట్రాభిమాన మతనికిఁ బూర్ణముగఁ గలదు. 'సిరికొలఁది చిహ్నా'లని చెప్పిన విధమున, నతఁడు సిరివలనఁ గలుగు దుర్వ్యసనముల ననుభవింపలేదు; దారిద్ర్యమువలనఁ గలిగెడు దురవస్థల నతఁడు పొందలేదు. సంసారుల కుటుంబములోనివాఁడు కనుక, నతఁడు దరిద్రుల దురవస్థఁ జూచి, విచారించి వారికిఁ దోడ్పడుచుండెను; భాగ్యవంతుల దుర్వ్యాపారములఁ జూచి, వారిని మందలించును.

అతని ప్రపితామహుఁడు, ''అప్పాజి-పంతులు'' 'సాంగలి' సంస్థానము పక్షమున వచ్చి, 'పునహా' పట్టణములో నివసించియుండెను. అతని పితామహుఁడు, 'అమృతరావు' పునహా జిల్లాలో 'మమలతదారు' ఉద్యోగములో నుండెను; అతనితండ్రి, 'నాసికాత్ర్యంబకము' జిల్లాలో 'నిఫాడు' మమలతదారువద్ద పెద్దగుమాస్తాగా నుండెను. మహాదేవుఁడు సం॥1842రము జనవరి తే18 దిని పుట్టెను. సం.11 రములప్రాయమువచ్చువఱకు నతఁడు హూణభాష నభ్యసింపలేదు; చిన్నతనములో నతఁడు మాతృభాషయగు 'మరాఠీ' భాషను వ్రాయను చదువను నేర్చెను; అతనికి మాతృభాషయందును మాతృభాషలో వ్రాయఁబడిన గ్రంథములయందు నభిమానముకలదు. 'మహారాష్ట్రవిజృంభణము' అను గ్రంథము నతఁడు వ్రాసి, దానిలో నతఁడు ''మహారాష్ట్రమహాభక్తులవిజయమును'' గుఱించి విశేషము ముచ్చటించెను. 'తుకారామ్' అను మహాభక్తుఁడు చెప్పిన 'అభంగు'లను గీతముల నతఁడు సదాపాడుచుండెను.



సం॥1851రములో నతఁడు 'కొల్హాపురీ' నగరమునుండిన పాఠశాలలోఁ బ్రవేశించెను. తదుపరి, ఎల్ఫిన్స్టన్-కళాశాలలోఁ బ్రవేశించి పెద్దచదువులఁ జదివెను. ఆకళాశాలకు 'సర్-అలగ్జాండరు-గ్రాంటు' దొరవారధ్యక్షులుగ నుండిరి; వారు కేవలము సరస్వతీపీఠమని చెప్పవచ్చును; సకలకళాపూర్ణులగు నాగురువు పాదముల నాశ్రయించి, రానడే కళారసము నాస్వాదించెను. గురుబోధములవలన నతనిబుద్ధి యింతకంతకు

వికసించెను. గురువునకుఁ దగినశిష్యుఁడును; శిష్యునకుఁ దగినగురువును దొరకుట దుర్లభము. అతనికిఁ దగినగురువు సంప్రాప్త మయ్యెను; లోభము గల తుమ్మెదపద్మము నాశ్రయించి, యెంత కొట్టినను దానినివిడువక, దానిమకరందము నాస్వాదించును; అటుల నతఁడు విసుగు లేక జ్ఞానామృతమును త్రాగుచుండెను. దేశచరిత్రములను, అర్థశాస్త్రముఁ జదువుటలో నతనిబుద్ధి విశేషముగఁ జొరవడెను; ఒక సంవత్సరము వేసవికాలపు సెలవులలో నతఁడు కళాశాలలోని పుస్తకభాండాగారములోని చరిత్రములనే కాదు. ప్రకృతిశాస్త్రములను వేదాంతశాస్త్రమును, నాటకగ్రంథములను, తదితరగ్రంథము లనేకము లతఁడు చదివెను. హూణభాషలో 'షేక్స్పియరు' అనుమహాకవి వ్రాసిననాటకములను, 'స్కాటు' అనుగ్రంథకర్త వ్రాసినకల్పితకథల నతఁడు చదివెను. "నేను సర్-అలగ్జాండరు-గ్రాంటు దొరవారివద్దఁ జదువుకొంటిని; నాపాండిత్యమునకు వారే కారకులు. వారివంటిసద్గురువులు దొరకుటదుర్లభము; సద్గురువుల నాశ్రయించినఁ గాని శిష్యుల తెలివితేటలు వికసింపవు" అని యతఁడు చెప్పెను.



శ్లో. "వందే గురుపదద్వంద్వ మవాఙ్మానసగోచరమ్,
రక్తశుక్లప్రభామిశ్రమతర్క్యం త్రైపురం మహః.
వందే గురూణాం చరణారవిందే సందర్శితస్వాత్మసుఖావబోధే, జనస్య యోజాంగలికాయమానే సంసారహాలాహలమోహశాంత్యై. అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా, చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః. గురుర్బ్రహ్మా గురు ర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః, గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః."

అని చెప్పినవిధమున నతఁడు సద్గురువు నాశ్రయించినందున నతనిబుద్ధి వికసించెను. ఏగురువులబోధనలును ఆచరణయు శిష్యులమనస్సులకు నాటునో వారే సద్గురువులు; గురువులయం దేపాటి సత్త్వయుండినను, శిష్యులు వారంతట వారతనిని మన్నింతురు; శిష్యులను దండించినందున, నతనినివారు గారవింతురా ?

మహాదేవుఁడు సం॥ 1862 ములో 'బి. ఏ.' పరీక్షలోను, సం॥ 1865 రములో 'ఎం. ఏ.' పరీక్షలోను, 1866 రములో 'బి. ఎల్' పరీక్షలోఁ గృతార్థుఁడయ్యెను. దేశచరిత్రపరీక్షలోఁ గృతార్థుఁ డయినందు కతనికి 'బంగారుపతకము'ను బహుమతి నిచ్చిరి;

సం॥ 1866వ రములో నతనిని 'బొంబాయి సర్వకళాశాలసభకు' మెంబరుగ నియమించిరి.

ప్రథమమున నతఁడు 'మహారాష్ట్రమున్షి'యుద్యోగములోఁ బ్రవేశించెను.కొంతకాల మతఁడు ఎల్ఫిన్స్టన్ కళాశాలలో పూరాణభాషాపండితుఁడుగ నుండి విద్యార్థుల కుపన్యాసముల నిచ్చుచుండెను. అతని యుపన్యాసములు విన సొంపుగ నుండెను; ఆంగ్లేయ పండితులు సహితము వానిని వినుటకు వచ్చుచుండిరి. బడిపంతులుగ నుండుట కతనికి మనస్కరింపలేదు. న్యాయవాదిగనుండినఁ బలువురతో స్నేహముఁ జేయుటకును, పదుగురితోఁ బ్రసంగించుటకును, పలువుర కుపయోగించుటకు నవకాశము లుండు నని యతఁడు తలఁచి, బడిపంతులయుద్యోగమును విడిచిపెట్టెను.

అతనిబుద్ధిసూక్ష్మము; అతఁడు నడుమును వంచి కష్టపడును;అందుచేత నతఁడు న్యాయవాదిగ రాణించెను. అతఁడు క్రమముగ వర్ధిల్లి "బొంబాయి హైకోర్టు—జడ్జీ" పనిలో నియోగింపఁబడెను. హిందువులు పొందఁదగిన గొప్పయుద్యోగ మంతకంటె మఱియొకటి లేదుకదా! అతఁ డామహోచ్ఛపదవికి వచ్చెను. సర్కారుపనులఁ జేయుచు,నతఁడొనరించిన



కార్యములు కొంచెము; కాని, యతఁడుస్వదేశము నుద్ధరించుటకుఁ బూనిన మహాకార్యములు వినఁదగియుండును. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తులును, ప్రభుమంత్రోత్సాహశక్తులు నతనికిఁ గలవు. అతఁడు తనశిష్యుల కీశక్తిమంత్రముల నుపదేశించెను. అతఁడు సర్వజనికసభకు ముఖ్యకారకుఁడు; ప్రార్థనసమాజములో నతఁడు మెంబరు; మహాభారతీయసంఘసంస్కరణసభ కతఁడు కార్యదర్శి; బొంబాయిసర్వకళాశాల 'సెనెటు' సభలో నతఁడు తెలివితేటల నుపయోగించి, స్వప్రయోజకత్వముఁ జూపించెను. ఒకసమయమున నతఁడొకచోట సభికుల కుపన్యసించును. అతఁడు సదావ్యాసములను వ్రాయుచుండెను. ఒకనిమిషమయిన నతనికి విరామము లేదు. అతఁడు చేసినగుప్తదానములకు లెక్క లేదు. స్వదేశము నుద్ధరించుటకుఁ దగినమహాకార్యముల నతఁడు సమకట్టెను.అతని జీవితకాలము వ్యర్థము కాలేదు;ఆజన్మాంత మతఁడు పాటుపడుచుండెను. 'కలౌ షష్టిః' అను న్యాయము ప్రకార మతఁడఱువదిసంవత్సరముల కొకటి తక్కువగ జీవించెను. పంచత్వముఁ బొందెను. అతనివంటి మహాపురుషులు మన దేశములోఁ గొంచెముకలరు; అట్టిపురుషులు ప్రాప్తించుట, మన కపు

రూపము; వారు విడిచిపెట్టినస్థలములోఁ బ్రవేశించి వారివలెఁ గార్యములను నెఱవేర్చువారు మనలోఁ గనఁబడరు; కనుక, వారు సం. 60 రములకే మృతి నొందిన, లోకులు విచారింతురు; అట్టిమహాత్ములు మృతజీవులని చెప్పుచున్నాము; వారిశరీరములు నశించినను, వారికార్యములు నిలిచియుండును; వారి శిష్యులు వారిబోధనలను పునశ్చరణఁ జేయుచుందురు. ఈమహాత్ముఁడు సం. 1901 రము జనవరి 16 తేదీని, దేహముఁ జాలించి, పరబ్రహ్మములో నైక్యమయ్యెను.

### మహాదేవుని గుణములు.

ఏపదార్థము నయిన నాణెము గట్టవచ్చును గాని మనుజునినాణెము గట్టుట కష్టము. ఏగుణములు లేనివాఁడును,ఒకరియుపేక్ష లేనివాఁడు నగుపరమేశ్వరు నే మూఢులు దూషింతురు. ఏవిధమునఁ జూచిన నతనికి లోపములులేవు కదా! ఒకమనుజుఁ డేపాటివాఁడు; వానిలో ననేకలోపములుండును; కొందఱు వానినిభూషింతురు. తదితరులు దూషింతురు. మనుజుఁడు చేసినకార్యములఁ బట్టి, వానియొక్క మంచిచెడ్డలను విమర్శింతురు; వాఁడు చేసినకార్యములు మాత్రము నిలిచి యుండును; ఒకకార్యముయొక్క



మంచిచెడ్డలు నిడివిమీఁదఁ దెలియును; వాని పూర్వోత్తరములను గ్రహింపక వానిని, వాని కార్యములను ఖండింపరాదు. తాత్కాలికముగ వానిని వానిపనులను పరులుదూషించినను, కొంతకాలమునకు వానికార్యములు ఫలించును. అందుచేతదూషణయు భూషణయు మహాత్ములకు సమానము; దూషించినందున వారు విచారింపరు. భూషించినందున వారు సంతసింపరు. వారికార్యములే వారికి సాక్ష్యము ; వారియంతఃకరణశుద్ధియే వారికార్యములకుఁ గూకటివేఱు; వారిబోధనలే దానికి నీరు.

చాకివాఁడు రామునివంటివానిలో లోపము గనిపెట్టెను; అట్టిస్థితిలో, రానడే యేపాటివాఁడు?అతఁడు సకలగుణసంపన్నుఁడని చెప్పలేము. అతఁడు సంపూర్ణుఁడు కాఁడు. సత్యము. అతనిలో సుగుణములును దుర్గుణములును కలవు; వానిలో నవి విశేషముగఁ గలవు;అతఁడు దుర్గుణముల నెట్లు విడిపించుకొనెను? మొత్తముమీఁద నతనిలో ననేకసుగుణములు కలవు. అతఁడుచేసినకార్యములను కొందఱు సహింపలేదు; వా రతనిని దూషించిరి. అంతమాత్రమున నతనికి దుర్గుణములు కలవని చెప్పుట భావ్యము కాదు.స్వతస్సిద్ధముగ నతఁడు సుగుణసంపన్నుఁడు కాని దుర్మార్గుఁడు కాఁడు.

శ్లో. "అమానిత్వ మదంభిత్వ
మహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం
స్థైర్య మాత్మవినిగ్రహః."

అని గీతావాక్యము కలదు.

అతఁడాత్మస్తవముఁ జేసికొనలేదు. అతనికి డాంబికము లేదు; అతఁడు జీవహింస చేయలేదు. అతఁడు శాంతుఁడు, ఋజుమార్గము ననుసరించి వెళ్లెను. గురువుకు శుశ్రూషఁ జేసి, జ్ఞానమును సంపాదించెను. అంతఃకరణశుద్ధి యతనికిఁ గలదు; అతనిబుద్ధి స్థిరమయినది; పరోపకారబుద్ధి కలవాఁడు కాని స్వార్థపరుఁడు కాఁడు.

అన్నిటికంటె గొప్పసంగతి మఱియొకటికలదు; అతనికి ననేకవ్యాపకము లుండెను; అతనికి బద్ధకము లేదు; అన్నిపనుల నతఁడు చక్కఁగ నెఱవేర్చెను. అతనికి గలయోపిక, పడుచువానికి సయితము లేదు. ఎంతపనిఁ జేసిన నతనికి శ్రమపుట్టదు; విసుగు లేదు. ఏపనిఁ జేయఁబూనినను, దానిపూర్వోత్తరముల నతఁడు సకృచ్ఛ్రముగఁ దెలిసికొని, దానిఁ జేయ నారంభించును; పనిఁ జేయునపుడు తొందరపడఁడు. గొప్పయుద్యోగములో నుండినను, గర్వము లేక యతఁడు



పలువురతోఁ గలసి మెలసి సంచరించెను; చిన్నతనములోఁ గష్టపడియుండినందున, నతఁడు పరులకష్టములఁ జూచి, విచారించి, తనశక్తికొలఁది వారికిఁ దోడ్పడుచుండెను.

అతనివంటిజ్ఞానియు, లోకోపకారియు, శాంతుఁడును మఱియొకఁడు లేఁడు. అతనిసుశీలతయు, నిర్మలహృదయమును, బీదల యెడల వాత్సల్యమును, ఏమని చెప్పఁగలము? భగవంతునియాశ లేక, యతనివంటి మహానుభావులు పుట్టరు. పరమేశ్వరుని చిద్విలాస మేమని చెప్పవచ్చును? ఈ మహాపురుషులు మార్గములోనిమైలు రాళ్లవంటివారు. వారిని స్మరించినమాత్రమున సకలపాపములు నశించును. "సాధుసాంగత్యము సర్వార్థసాధకము"

## రానడేయొక్క యుపదేశములు.

రణధియొక్క జీవితము వ్యర్థము కాలేదు; అనేకులజీవములు నిరర్థకము లగును; కాని, యతఁడు మాత్రము లక్ష్యము నిడికొని, దానిఁ బొందుటకుఁ దగినశ్రమపడెను. లోకములోఁ బుట్టినందుకు, మనుజుఁడు సార్థకమగుపనులఁ జేయవలెను; లేనియెడల, వానిజీవనము నిష్ప్రయోజనము. అనేకఋణములను మనుజుఁడు తీర్పవలెను; గృహస్థాశ్రమములో

నుండి, వాఁడీఋణములను గ్రహించి, నడుముఁ గట్టుకొని, పాటుపడినకాని, ఋణవిముక్తుఁడు కానేరఁడు; ఇతరులవలెఁ గాక, రానడే యథాశక్తి శ్రమపడి, ఋణవిముక్తుఁ డయ్యెను; పరోపకారమువంటి ధర్మమును పరపీడవంటిపాపమును లేదు; ఎంతవఱకు నతఁడు, భారతీయుల హీనదశఁ జూచి, దుఃఖించి, వారి నుద్ధరించుటకుఁ దగినపనులఁ జేయ నారంభించెను.

"మనుజునిశరీరములో మూఁడుధాతువులు కలవు; ఆమూఁడును సమముగ నుండినఁగాని వానికి స్వాస్థ్యము లేదు; గృహస్థాశ్రమములో నుండినయొక్కఁడును, స్వాస్థ్యముగ నుండినఁ గాని, సంఘమునకు దేశమునకును ముప్పువచ్చును. శరీరములో నెచ్చట దెబ్బతగిలినను, శరీరమంతయు నది వ్యాపించును. అటులనే, ప్రతిగృహస్థుయొక్క మంచిచెడ్డల ఫలమును వాఁడే కాదు. వాని సంఘమువారు సహితమనుభవింతురు. అందుచేతఁ బ్రతిమనుజుఁడును యథాశక్తి మంచిపనులఁ జేయవలెను. లక్ష్యము లేకుండ నేపనిఁ జేయరాదు; ఏపనిఁ జేసినను, దాని ఫలమును, వానికుటుంబము వారును, వాఁడును, వానిదేశీయులు ననుభవింతురని లక్ష్యములోనుంచు



కొని, ప్రతిగృహస్థుఁడును ధర్మముల నాచరింపవలెను," అని రానడే చెప్పుచుండెను. గృహస్థునియొక్క భారమింత యని యతఁడు లెస్సగ గ్రహించి, తదనుగుణముగఁ బ్రవర్తించెను.

సంఘము బీరకాయపీచువంటిది; దానిధర్మములనేకములు; వానిని బాగుగ నిర్వర్తించుట కష్టము; ఏధర్మమునకు లోపము వచ్చినను, సంఘమునకు ముప్పు వచ్చును; ఆధర్మములకు లోపము వచ్చిన యెడల, సంఘము నశించును; ఆసాంఘికధర్మములను తెలిసినవారు తక్కువమంది కలరు; అన్నిధర్మములు తెలిసినను వానిని సమముగ నడిపించుట కొక మనుజునకు శక్యము కాదు. పలువురు తోడ్పడినఁ గాని, యాధర్మముల నడిపించుట దుస్తరము. పరుల యపేక్షఁ గోరి, వారికి నమ్మకముఁ బుట్టించి, వారిచే సకలధర్మములఁ జేయించుటకుఁ బూనుకొనినవాఁడు మహాపురుషుఁడు. ఆమహాత్ముఁడు సర్వధర్మములఁ జేయుచు, పరులకు నిదర్శకుఁడై యుండును; అట్టిమహాపురుషుఁడు రానడే; శరీరధర్మములును, సాంఘికధర్మములు నతఁడు, నిర్వర్తించెను; అందుచేత నతఁడు సర్వవ్యాపకుఁడు; అతనికి యొకవ్యాపకత్వము కాదు; ఇన్నిధర్మముల నతఁడు గుర్తెఱిఁగియుండినందున, నతఁడు, మాటలవలనను, క్రియలవలనను వానిని

యథాశక్తి నడిపించెను. అతఁడుచేసిన ధర్మోపదేశములనిచ్చట వివరించెదము:—

"శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్" అనిచెప్పఁబడియున్నది. శరీరము నిలువఁబడియుండినయెడల, మనుజుఁడు సకలధర్మముల నాచరింపఁగలఁడు; కనుక, నట్టిశరీరమును నిలువఁబెట్టుటకుఁదగినపనులఁ జేయవలెను; స్నానపానాదులవలనను, శరీరపరిశ్రమవలనను, శరీరమును నిలువఁబెట్టవలెను; దేశకాలానుగుణముగ శరీరమునకుఁదగినంతపరిశ్రమ నిచ్చి, నిద్రాహారములలో దానినిసమముగ నడిపించినయెడల, దానికి సంకటము గానేరదు. అప్పుడాశరీరధారి సకలధర్మములను నిర్వర్తింపఁగలఁడు. ఆహా! ఆనాఁటి కానాఁడు, మనశరీరదార్ఢ్యము లెంతతగ్గెను! దేహమునకుఁ దగినంత పరిశ్రమ లేక పోవుటయే దీనికిఁ గారణము; దేహబలమే, బుద్ధిబలమునకు మూలము; దేహములు శుష్కించిన, బుద్ధి కృశించును; దేహము లెంత స్వాధీనములో నుండిన, నంత మంచిది; అప్పుడే, వానిబుద్ధి పాదరసమువలె నలువైపులఁ బరిణమించును; దేహము మనుజునిస్వాధీనమునుండి తప్పిన, వాఁడుపడిన శ్రమఁ జెప్పలేను; ఈనాటికి భారతీయులు దేహపరిశ్రమను విడిచినందుకు దుఃఖము కలుగుచున్నది........" అని యతఁడు దేహపరిశ్రమగురించి ప్రసంగించెను.



ఇదియొకధర్మము; అన్నిధర్మముల కిది మూలధర్మము. "ఇఁకను సాంఘికధర్మములు కలవు; అవియనేకములు; ఒకటితో నొకటికలసియుండును. ఈధర్మములు మనలోఁ గలవు. వీనిని మనము విదేశీయుల వద్దనుండి నేర్చుకొనఁ బనిలేదు; మన వేదశాస్త్రములే మనకుఁ బ్రమాణము; వానిలోఁ జెప్పఁబడినప్రకారము మనము సంచరింపక పోవుటచేత, గొన్నియనర్థములు మనకు వాటిల్లెను; శాస్త్రము ననుసరించి, మనము ధర్మముల నాచరింపవలెను." అని యతని తాత్పర్యము. తదుపరి, మతధర్మములనేకములు కలవు; వానితో గృహస్థాశ్రమధర్మములు కూడి యుండును. "ఈధర్మములను మనము పూర్వులమార్గముల ననుసరించి, నిర్వర్తించినయెడల మనము మన దేశము నభివృద్ధిలోనికి వచ్చెదము. మన యీధర్మముల నొకరివలన నేర్చుకొనుటకు శ్రమపడవలసినపని లేదు. ఇతరదేశీయుల మతధర్మములను గృహస్థాశ్రమధర్మములను మనధర్మములతో సరిపోల్చినయెడల మనధర్మములకే యగ్రాసనము వచ్చును; ఆహా! మనమాధర్మములను విడిచినందున, మనసంఘమున కీదురవస్థ వచ్చెను. శ్రుతిస్మృతుల ప్రమాణముల ననుసరింపక పోవుటచేతనే, మనకీదుర్దినములు సంప్రాప్తమయ్యెను; మనసాంఘిక ధర్మ

ములు చెడిపోయెను; గృహస్థ ధర్మములు నశించెను. ఓసోదరులారా! నానమ్మకమును వినుఁడు; మన యాచారములును, మనసాంఘికధర్మములును, మన గృహస్థాశ్రమధర్మములును, ఈనాఁడానాఁడుపుట్టినవి కావు; 5, 6 వేలసంవత్సరములకుఁ బూర్వము నుండి వచ్చుచుండెను. మనపూర్వులు అనఁగా ఋషులు, పరాశరులు, వ్యాసుఁడు మొదలగువారు మన దేశమునకును, కాలమునకును, స్వభావముల కనుగుణముగ నుండునట్లు సకలధర్మముల నేర్పఱిచిరి. వానినెంతో దూరమాలోచించి, వారు నిర్ణయించిరి; కాని, యొకరియాచారములు మనకుఁ బ్రవర్తింపవు; ఒకరిధర్మములు మనకు రుచింపవు; మనధర్మముల ననుసరించుటవలన మనకు శ్రేయస్సు కలుఁగును; పరుల ధర్మములవలన, మనకుఁ బ్రయోజనము లేదు.'' ఈప్రకారమతఁడు సాంఘికధర్మములకును మతధర్మములకుఁ గలసంబంధములఁ జెప్పుచుండెను. మఱుఁగు పడిన సాంఘికధర్మముల నుద్ధరించుటయే సంఘసంస్కరణము; అతఁడు గొప్పసంఘసంస్కర్త; కొంతయీఁడు వచ్చినతరువాత, బాలికాబాలురకు వివాహముఁ జేయవలయుననియు, పునర్వివాహములఁ జేయవచ్చుననియు, జాతిభేదము లుండకూడదనియు, అతని ముఖ్యాభిప్రాయములు.



తదుపరి, చిత్రక్రియ, లోహక్రియ, అంబరక్రియ, అశ్మక్రియ, మృత్క్రియ—ఈమొదలగుకళలు కలవు. ''ఓసోదరులారా! మన దేశము కళావిహీనమగుచున్నది; లోహక్రియ, దారుక్రియ, అంబరక్రియ, ధాతువాదము, ఖనివాదము—ఈమొదలగునవి జీవకళలు. జీవకళలు నశించినయెడల, దేశము జీవించునా? జీవకళలే దేశమునకుఁ బ్రధానము; వానివలన దేశము రాణించును; ఆకళలే జీవనమున కాధారభూతములు. జీర్ణించుచుండిన జీవకళల నుద్ధరించుటకంటె నుత్తమప్రయోజనము మఱియొకటి లేదు.''

తదుపరి, రాజధర్మములు కలవు. చతుష్షష్టికళలకును, సాంఘికధర్మములకును, గృహస్థాశ్రమధర్మములకును,—సకలధర్మములకును రాజధర్మమే మూలాధారము; సకలధర్మములకు నది నిట్టకొమ్మ. ''హిందూదేశముయొక్క ఆదాయవ్యయముల'' గుఱించి రణధివ్రాసినవ్యాసములలో, సీరాజధర్మములను గుఱించియు, ఆదాయ వ్యయములను గుఱించియు చెప్పఁబడియున్నది. మనపూర్వపుణ్యమువలన, మనకు ఆంగ్లేయదొరతనమువారు లభించిరి. ఈనాటికి వారిప్రాపకమువలన మనము స్వాస్థ్యము ననుభవించుచుంటిమి; అయిన, నిందులో నొకవిశేషము

కలదు. ఇతరదేశీయులకంటె మనలోఁ గొన్నిరాజధర్మములు లోపించెను; ఆలోపములను దొరతనమువారు క్రమముగ పూర్తిచేయుచుండిరి; "ప్రజాప్రతినిధిసభలు", "శాసననిర్మాణసభలు" ఈమొదలగునవి వారివలననే మనకు లభించెను.

అతఁడు సర్వవ్యాపకుఁడు. అనేకవిషయములను గుఱించి యతఁడు వ్రాసి యుండెను; ప్రసంగించి యుండెను. అతఁడు లక్ష్యములలో నొకదాని నుంచుకొనెను. దేశాభివృద్ధియే యతనిలక్ష్యము. ఆవిషయమును గుఱిలో నుంచుకొని, యతఁడు ప్రవర్తించెను; విరామమనుమాట లేక యతఁడు రాత్రింబవళ్లు పాటుపడెను. గృహస్థాశ్రమధర్మముల నతఁడు నిర్వహించినప్రకారము మఱియొకఁడు నిర్వహింపఁగలఁడని తోఁచదు.

రానడేగారు మృతినొందినతరువాత, బొంబాయినగరములో నొకమహాజనసభ జరిగెను. బొంబాయిగవర్నరు "ప్రభువు—నార్తుకోటు" గారు సభాధ్యక్షులయిరి. గోఖ్లేగారు కీర్తిశేషులగు రానడేగుఱించి యుపన్యసించిరి:—"ఓమహాప్రభూ! ఓమహాజనులారా! ఆసేతుహిమాచలపర్యంతమువఱకుఁ గల మహాజనులను దుఃఖసముద్రములో విడిచిపెట్టి, మహాదేవగోవిందరానడేగారు పరమపదమునకు విజయముఁ



జేసిరి. నలువదిసంవత్సరములహోరాత్రములు వారు మననిమిత్తము శ్రమపడి దేహముఁజాలించి, వారివలె సకలధర్మములను గుర్తెఱింగినవారును, వారివలె వానిని నిర్వహించినవారును, నడియంతరమున ననేకవిఘ్నములువచ్చినను వెనుదీయక నడికట్టువిప్పక వారివలెఁ గార్యములను పూనికతో నెఱవేర్చినవారును వారివంటిశాంతులును, దాంతులును పరోపకారులును, మనలో విశేషముగఁ గనఁబడరు. ఏవిషయమును గృహస్థు లక్ష్యములో నుంచుకొనవలయునో, ఏవిషయమును సాంఘికులు లక్ష్యములో నుంచుకొనవలయునో, వానినతఁడు నిరూపించి, వానిప్రకారము సంచరించెను. స్వభావసిద్ధముగ నతనికిఁ దెలివితేటలు కలవు; అతనిబుద్ధి సూక్ష్మము; అతనిధారణాశక్తి అసాధారణము; అతనియోపికకు మితములేదు; అతనికి దుర్వ్యసనములు లేవు; అతఁడు కేవల మవతారపురుషుఁ డని చెప్పవచ్చును.

"అతనివంటిసమవర్తి కనబడఁడు; ఆసేతుహిమాచలపర్యంతమువఱకుఁ గలభరతఖండములో, మహామ్మదీయులు, పారసీకులు (Parsees) క్రైస్తవులు, బౌద్ధులు మొదలగు నానాజాతులవారు కలరు; ఏజాతిభేదములు లేక వారందఱు భారతమాతపుత్రులని యతఁడు తలచి, వారినిఁ బ్రేమించెను. ఏజాతివారయి

నను, తెలివి తేటలఁ గలిగియుండినయెడల నతఁడు వారి నాదరించు చుండెను. ఏజాతివా రయినను, భారతమాతను బ్రేమించి ఆమెనిమిత్తము శ్రమపడినయెడల, వారు గౌరవనీయులని వారియభిప్రాయము. కళ లన్నియు సంపూర్ణముగ నుండవలెను; లేనియెడల, దేశమునకు లోపము వచ్చును. ఒకఁడు సర్వకళల నభ్యసింపఁజాలఁడు; కనుక, మనుజులు జాతిభేదములను విడిచి, వారివారిబుద్ధ్యనుసార మాయాకళలనువృద్ధిఁ జేసినఁగాని దేశమునకు క్షేమముకలుగదు.

'ఓసభికులారా! రానడేగారిలో మఱియొకవిశేషముకలదు. పరులసుగుణములనే వారు సదా యెంచుకొనుచుందురు; పరులలోపములను సవరించి, వారిసుగుణములనే వారుచెప్పుచుందురు. ఆత్మస్తవమను మాట వారిలోఁ గనఁబడదు; స్వలోపములను శోధించుకొనుటలో, వారితో సమానులు లేరు; ఎంతవఱకును, వారు స్వలోపములను సవరించుకొను చుండిరి. ఇంద్రియనిగ్రహమును గుఱించి చెప్పవలసివచ్చినపుడు, మొదట వారిని జెప్పవలయును. వారినామమును స్మరించి, వారియాచరణవిధానముల ననుసరించినయెడల, దేశీయులకు క్షేమము కలుగును.

ఓం తత్సత్.

---

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.—1917.

